# శ్రీ విశ్వవిజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము
# పి ఠా పు ర ము

## త త్త్వ ప రి బో ధ ము
## గురువారం సభాకార్యక్రమము

### ప్రార్థన

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ సద్గురవే నమః

గీ. జ్ఞాన మజ్ఞానములమధ్య , గ్రాలునన్ను
అన్నపానాలకై అంగ , లార్చునన్ను
బహుళ తాపత్రియంబుల , బడయునన్ను
దుఃఖ చితికిం ధనంబునై , దొరలునన్ను
ఎటులఁగాచెదవో నీలోవ , నెటుల జేర్చుకొందువో
దేవ నేను నీ , యందె భారమాని
అర్థించుచుందురే , యంబవళ్ళు
నిన్నె వీక్షించుచుందునే , తెన్నుకన్ను

మలపిచూచిననీరూపె , కానుపించు
నిలచి కాంచిన నీ కాంతి , వెలుగుచుండు
పిలచి చూచిన నీ పేరె , పలుకు చుండు
నీవె సకలంబు నీ యందు , నేను గలను

వెదలజాలని పాతాళ , వీధులందు
చేరనేరని ఆకాశ , సీమలందు
ప్రాకనోపని జలధిగ , ర్భములయందు
నీవే యున్నావు నాయందు , నీవులేవె.

సాంధ్యరాగముల యందును , షస్సులందు
కిసలయంబుల యర్రని , ప్రసవములను
సానువులఁ బారెడు నదీ , సలిలమందు
తరచు నాగుండెలోని ర , క్తమును పిండి
పూతపూసితివాలేద , పుడమి నన్ను
బెట్టుకష్టాల నే లెక్కఁ , బెట్టునెడల
ఏది విశ్రాంతి నీ ధ్యాన , మే సమాధి
ఏది యవధి నీ పూజె య , భీష్టసిద్ధి
వేఱు గత్యంతరములేదు , వెదుకరాదు.

శాంతి గీతాలుపాడు శ , కుంతలములు
ప్రకృతి సతి రిక్కలను తలఁ , బ్రాలు జల్లు
నగములొాగి లేచి నీ మహో , న్నతికి మ్రొక్కు

14/11/95

ఎల్ల లోకాలు నీ యిందు • లేనునీదు
పాదసేవకునై నను • పనికిరానె
వెలిచి కాపాడుమనుట క • క్కరకు రానె
చూడుమీ నన్ను నుటకు నో • చుకొనగలేదె
రమ్ము నాలో వసియింపు మా • లస్యమేల
రమ్ము నాయెట్ట యెదుట కూ • హ్యమ్ము లేల
రేపనునది లేనేలేదు • లేదుతండ్రి.

ఓం యీశ్వరా నీవు అనంతుడవు. అనుపమానుడవు. ఆకాశమువలె నిండి గాలివలె వ్యాపించి భూమివలె చరాచరభూత కోటిని మోయుచున్నాడవు. సూర్యునివలె జగజ్జాలములను వెలిగించు చున్నాడవు నీకంటె ఘనులుగాని, పూజ్యులుగాని, పవిత్రులుగాని ఎవరునూ లేరు స్వామి నీ మహిమ, నీ శక్తి నీ వైశాల్యము, నీలోతు నీ సర్వజ్ఞత్వము తెలిసిన వారెవరునూ లేరు నీవు సృష్టిస్థితిలయములకు మూలమై జ్ఞాన అజ్ఞానములు, కలిమిలేములు, ఘనాధికములు, బంధమోక్షముల కతీతమైన నీ నిజతేజము ఎల్లమానవ జీవకోటికిని ఆధారభూతమై ప్రకాశించు చున్నది. స్వామి నిన్ను నమ్మినవారు నశించరు నిన్నుధ్యానించు వారికి దుఃఖములులేవు. నిన్ను మనస్సులో నుంచువారికి భయము లేదు. మేము పామరులము దీనులము నీవే దిక్కనినమ్మియున్న భక్తులము మా భారము కర్ణధారునివలె నీపై వేసుకొని మమ్ము మాయ యందును, పాపములయందును హింసలయందును పోని

య్యక నీతత్త్వతి పాదకంజయినమహావిశ్వమునందు సత్వదావిలిపి నీదయాయను సర్వశేచనమున మమ్ము పునరుద్ధరించి. మా కష్ట ములను తీర్చి. మా అజ్ఞానమనే చీకటిని తొలగించి. మా పొర పాట్లు మన్నించి స్వామి మమ్ము అన్ని విధాలకాపాడి సంరక్షిం పుము తండ్రి స్వామీ నీవు దయాళువు దీన రక్షకుడవు దేవాదిదేవు డవు సచ్చిదానందస్వరూపుడవు. ఈశ్వరుడవు నీకు మా నమస్సు లగుమ గాక !



## మంత్రపుష్పం

సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్।
విశ్వం హూస్సేన్‌షా సద్గురు దేవమక్షరం పరమం పదమ్.
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం హూస్సేన్‌షా సద్గురుంహరిం
విశ్వమేవేదం పురుషస్తద్విశ్వముపజీవతి.
పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ంం శాశ్వతగ్ంం శివమచ్యుతమ్॥
హూస్సేన్‌షా సద్గురు మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్.
హూస్సేన్‌షా సద్గురు పరంజ్యోతిరాత్మా హూస్సేన్‌షా సద్గురు పరః
హూస్సేన్ షా సద్గురు పరబ్రహ్మ తత్త్వం హూస్సేన్‌షాసద్గురుపరః
హూస్సేన్‌షా సద్గురుపరోధ్యాతా ధ్యానం హూస్సేన్‌షా సద్గురు పరః
యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా.

అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప హుస్సేన్ షా సద్గురు స్థితః
అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేన్త విశ్వశంభువమ్॥
పద్మకోశ ప్రతికాశగ్ం హృదయం చాప్యదోముఖం
అధోనిష్ట్యావితస్త్యాన్తే నాభ్యాముపరితిష్ఠతి॥
జ్వాల మాలా కులం భాతి విశ్వస్యాయతనం మహత్
సన్తతగ్ం శిలాభిస్తులంబత్యాకోశసన్నిభం
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మింత్సర్వం ప్రతిష్టితమ్॥
తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చిశ్వతో ముఖః
సోగ్రభుగ్విభజన్తిష్టన్నాహార మజరః కదిః
తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్యసంతతా.
సంతాపయతిస్వం దేహమాపాదతలమస్తకః
తస్యమధ్యేవహ్నిశిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః
నీలతోయదమధ్యస్థావిద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూక వత్తన్వీ పీతాభాస్వత్యణూపమా
తస్యాశ్శిఖాయామధ్యే శ్రీ హుస్సేన్ షా సద్గురు వ్యవస్థితః
సబ్రహ్మసశివస్స హరిస్సేన్ద్రసోక్షరః పరమస్స్వరాట్॥
ఓం విరాట్ పురుషాయవిద్మహే శ్రీ ఉమర్ ఆలీషా సద్గురు స్వరూపాయ ధీమహి
ఓం విరాట్ పురుషాయ విద్మహే శ్రీ హుస్సేన్‌షా సద్గురు స్వరూపాయ ధీమహి

ఓం విరాట్ పురుషాయ విద్మహే శ్రీ మొహియద్దీన్ బాద్షా సద్గురు స్వరూపాయ ధీమహి
తన్నో శ్రీ ఉమర్ అలీషా సద్గురు ప్రచోదయాత్
తన్నో శ్రీ హుస్సేన్ షా సద్గురు ప్రచోదయాత్
తన్నో శ్రీ మొహియద్దీన్ బాద్షా సద్గురు ప్రచోదయాత్.
ఓం నమస్తే ఓం నమస్తే నమః
ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః



## గురువు

బ్రహ్మజ్ఞాన ముపదేశించువాని కాప్తుఁడందురు. ఆప్తుఁడన మంచి చెడ్డలయందుఁ దోడ్పడువాఁడును భేషజము లేనివాఁడును అని యర్థము ఒక శిష్యునికొక గురువీశ్వర సాక్షాత్కారముపదేశింప నాతనికి గేదె కనిపించినది. గురూజీ ! నాకు గేదె యగుపడుచున్నది ఈశ్వరుఁడగుపడలేదని చెప్పినాఁడు.

గురువు విని నీవు పూర్వాశ్రమమున గేదెను మేపినావు. అని చెప్పి వానికాభ్రాంతినుండి తొలఁగించెను. గురుశిష్యులకంత స్వాతంత్రత యుండవలయునని భావము. చీఁకటిలో చిన్నవస్తువు దీపము కన్నులు నున్ననగుపడును. దీపము పెట్టి కన్నులు

మూసినను కన్నులు విప్పి దీపమార్పివేసినను వస్తువగుపడ నేరదు. అట్లే దీపమువలె గురుని సహాయమున శిష్యుఁడీశ్వరు నెఱుంగవలయును. ధ్యానసమాధిలో గురువును నెదుటను చూడ వలయును. ఆ దృష్టి ఆలాలగ్నము చేసితే గురువగు పడును. ఇది మొదటి (Stage) రంగము,

## మంత్రము

బ్రహ్మజ్ఞాన సాధనమునకు మంత్రము అక్షరాభ్యాసము వంటిది "గాయత్రి" "కల్మా" ఇవే మంత్రములు. మంత్రమువలన ఈశ్వరరూప నిష్పత్తిని ప్రతిపాదించునవి ఇవి పూసలలోని దారమువలె భక్తులను నొకటిఁగా జేయు కట్టుతాడు సూదంటు రాతినంటిన సూదు లొకదాని నొకటి యాకర్షించినట్లు దీనివలన సంఘీభావమును సుస్థిరచిత్తము (Concen-tration) కుదురును మానవునిలోని విద్యుచ్ఛక్తి (Electricity) సుషుమ్నా (షారగ్) నాడి యందున్నది. ఆద్వారము తెరచి పరమార్థమునందంధకారము లేకుండ నేయు దీక్షకివి సాధనములు భవసాగరము దాటుటక మంత్రము పడవ వంటిది.

గాయత్రి॥ ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి ధీయో
యోనః ప్రచోదయాత్ ॥ యజు॥ ౩౬ మం ౩ ॥

కల్మా॥ లాఇలాః ఇల్లల్లా
మహమ్మద్ రసూ లిల్లా॥

భాండశుద్ధిలేని పాక మపూజితమైన తెఱంగున సద్గుణ సంపత్తి లేనివానికి బ్రహ్మవిద్య రానేరదు. ఒకగురు సంప్రదాయమునకు జేరిన వారందఱొక చెట్టునకుండు శాఖలవంటివారు ఏవంక వ్రేళ్ళ కేమాత్రము నీటిచెమ్మ లభించినను నది చెట్టంతకుఁ జివరాకుల రాఁక పచ్చబాఱఁ జేయునట్లే శిష్యుఁడు తపస్సు చేసినను ఆ తపోఫలశక్తి యెల్లరకుగా సంతకాసంత పంచఁబడునని యెఱుంగ వలయును. మఱియు తపస్సుచేసినవారి కేమియు తఱుఁగదు.



శ్రీ

# పరతత్వ కీర్తనములు

హంయరీరాగము - ఆటతాళము

ఘనశక్తి యుక్తుడవు - నను బ్రోవుమీ పెద్ద
పనిగాదు భక్తుడను - గురురాయా ॥గురు॥
మును నీవిరాడ్రూప - మున జగముదయించె
గను నే వన్యుడగాను - గురురాయా ॥గురు॥ 1

క్రింపుమీదెఱుఁగని - కందూలతోఁగూడి
నింబాల పాలైతి - గురరాయా
అందమైన సదా - నందయోగమగ్న
మందుంచి నన్నేలూ - గురురాయా గురురాయ ॥ 2

నాదమె నరుఁడు చి- త్సాధాన మెఱిఁగిన
వాదాము లడుగంటు - గురురాయా
మోదాముతోబిందు - పాదామె కళ ప్రణవ
పాదోధి యెదఁజూపు - గురురాయా ॥గురు॥ 3

భుజములె నయనాము - లజునీదె యెఱుక నీ
సృజనమె వాక్కూలు - గురురాయా॥
నిజజీవ స్థానాము - నీదే భావము నాది
భజియించు నను బ్రోవు - గురురాయా ॥గురు॥ 4

సాహస్రాతము మించి - యూహించి చూచితే
దేహ మధ్యమునందు ।గురు।
సోహంబనియెడు ఆత్మ మోహరహితమై సం
దేహము లడగించె - ।గురు। 5

ఎందెందు వెదకిన - నందందె గలవని ని
న్నందా రందరు గాదె - గురురాయా ।గురు।

డెందంబులో జీవి - చందంబుగా వెల్గు
చుందావు రేపగలు - గురురాయా ।గురు। 9

పదద్వందములు వాయా - పదమూలె శి తనువు
మొదటి శ్రవణపము జూడ - గురురాయా
సదయ యాఖైలలీషా సామి మొహియదీన్ బాషా
ముదమార(బోగ్రిషమీ గురురాయా ।గురు॥

కావేరిరాగము - ఆటతాళము

నన్నుతించెదను నాగురుని నన్ను
మన్ననతో (బోవు మనుచు వే(డితిని ।నన్ను। 1

కన్నెడ సేయవద్దంటి నన్నా
పన్నాని దయ(జూడు - పన్నగభరణా
పన్నగ పాపహరణ - ఉన్నతదీవ శరణా
ఉన్నాని నన్నేలు కరుణ - ।నన్ను। 2

నిన్ను నమ్మితి భ్రమ బాసితిని నన్ను
నిన్నాని దెలిసి నియమమ్ముచె గొలచి
కన్నుల నడుమా నిలిచి
తెన్నిదియాన తెలసి

నన్నాశ్రయించితి వలసి గాన
విన్నాణమౌ మతిని గలిగి తలవంచి ॥నన్ను॥ 3

పొందితి రాజయోగంబు నందు
జెందిన సాంఖ్య తారక యమనస్కంబు
లందిన యా యోగంబు
నందలి యనురాగంబు
చందంబు నేనై కరంబు
బిందు నాదంబు కళజీవినై యోంకారంబు ।నన్ను। 4

అయమాత్మ బ్రహ్మమందురు. దాని
మయ మహామస్మి బ్రహ్మమనియు బల్కుదురూ
తయభక్తు లెఱుంగరూ
త్రయజ్ఞాన మెఱుంగారు
త్రయగుణ్యరహిత మెఱుంగారు ప్రజ ని
స్త్రియ గుణ్యపథవిచరితా మనుచు నేరు ।నన్ను। 5

ఏక ప్రకాశ సర్వేశా సకల
లోక సహకార గురువా ఖైలలీషా
చేకొని మొహిదీన్ బాషా
సాకుల ధరవిశేషా
స్తోకైక జ్ఞానమనీషా ఎల్ల
శోకంబు లుడుపూము భక్తైకపోషా ॥నను॥ 6

## సావేరిరాగము — అటతాళము

గురుని గౌరవలెరా తత్వము
మఱుగును గనవలెరా
గురుని గౌరవలె మరుగును గనుటకు
దురిత భవంబుల దురిమి మనంబున ॥గురు॥ 1

చారుతరంబైన ఆత్మ
కారా కారమున
తారక సాంఖ్యము తరచి తరచి మది
సారె సారె క్రమ నస్కా పదంబున ॥గురు॥ 2

నరజన్మ మెత్తి హరిని
నరయలేని తిత్తి
పురుగు సుమీ భారత యితి హాసము
లెఱింగి వచియించిన నేమి ఫలంబగు ॥గురు॥ 3

ఆరు గుణము లణచి ప్రకృతిని
వేరుజేసి నిలిచి
తారక మందున తత్వము గనుగొని
నేరచి యెఱుకలో యెఱుకను నిల్పియు ॥గురు॥ 4

తరముగాని తత్వం పదముల
నరయ మిట్లు సత్యం
తెలిసిగిన వారికి నరకము లేదిక
పర బ్రహ్మమగు ప్రత్య గాత్ముడగు ।గురు। 5

మహి యాఖ్యాల లిషా కరుణకు
మొహియుదీను బాషా
శిరమిడి వెరువక స్థిరమై పరమై
పరం జ్యోతియై పరగిన విధమిది ।గురు। 6

## పీలూరాగము - ఆటతాళము

ఓం కారమే జీవమనుచు నమ్మి
నాకారమునను వీక్షించు
ఏకమౌను నీలో అకారమును బొంది
ఆకంటినడుమ నీ
వఖిలాత్మై నిలిచెదవు ।।ఓం। 1

ఓంకారమునకు నాదామునకు భేద
మున్నా దేమిటో తెలియ వలయు
ఓంకార మిహమగును నాదాము నీవగును
శంకలెంచక తనుతాసాధించిజూచితే ।ఓం। 2

తొలిజన్మ పదము లన్నిటిని తలంచి
తలంచి నే జాలి నొందితిని
ఇలకొన్ని జన్మములు ఈజన్మమున జరిపి
తెలివిలోపల తెలివై తేజము కనుగొంటి ।ఓం। 3

ఆది యనాది మర్మంబు తెలివి
సాధించి గనుటు ధర్మంబు
బిందు బీజము నందు నీవై నిలచి నాద
మందు లగ్నంబై యా నందాము నొందెదవు ।ఓం। 4

నేనై నను జూచు చుంటిని ఆఖై
లలి గురు నచట గంటిని
జ్ఞానసమాధి మొహియుద్దీన్ బాషా పం
ధాన ధ్యాన మిదియె తర్కించి చూచితే ।ఓం। 5

జంఝూటిరాగము - ఏకతాళము

శ్రీగురు ఓం, శ్రీగురు ఓం, సత్యము చిత్కళానిధి ।శ్రీ।
సరణి చరాచర స్థూల సూక్ష్మం బం
ధుర శరీర శ్రీ ।శ్రీ।
అక్షయుం డవ్యయుం డక్షరుండు బహు
పక్షేపుండవు ।శ్రీ। 1

శిక్ష పూని రక్షణఁ జేయుటకు
దీక్ష వహించవుము ||శ్రీ|| 2

లక్ష్యభావమీక్షించి నప్పుడు
సూక్ష్మ కరుండవు ||శ్రీ||
వక్ష్యమాన స్తోత్రములుజేసిన నొక
యక్షరము దొరకదు ||శ్రీ|| 3

ఈక్షితి దయ నీక్షణ జేసి సు
భిక్ష మొసంగిన ||శ్రీ||
పక్షపాత మేటికి రక్షకుఁడవు
దాక్షిణ్య నిధీ ||శ్రీ|| 4

యక్ష కిన్నరులు నుతించిరి యే
కాక్షరి నీ వని ||శ్రీ||
కక్ష కలిగి కలిని సంహరించిన
సాక్షాత్కాలికము ||శ్రీ||

త్రయవస్థల త్రిగుణంబుల
త్రయ మూర్తుల కతీతుఁడవు ||శ్రీ||
త్రయీ స్వరూపుఁడ త్రికూట నిలయుఁడ
త్రయంబ నుతుఁడవు ||శ్రీ|| 6

చిదా నందుఁడవు బుధానుమతుఁడవు
సదా శివుండవు ।శ్రీ॥
ముదావ హుండవు శ్రుతీ ప్రసిద్ధుఁడవు
హృదంత రాళుడవు ॥శ్రీ। 7

నవలేషములై యవని నవతరించిన
రవి తేజుఁడవు ।శ్రీ॥
నవ బ్రహ్మ నవ సంస్కార నధీ
నవేనాధిపతీ ।శ్రీ। 8

శరణు శరణు శ్రీయాఖైలలీ గురు
చరణాబ్జములకు ।శ్రీ।
మురయుచు వేడెదు మొహియదీన్ బాషా
వరద భజించెద ।శ్రీ। 9

జాలికాంభోజిరాగము-ఆదితాళము

మాయా జాలములోను మఱఁగై యున్నవాని
మహిమ దెలియనైతినే అమ్మయ్య 1

కన్నవారి రిల్లాని మన్ననఁజేసితి
ఏన్నాటి కరుగానుగా ।అమ్మయ్య। 2

మాసములు పది రెండు
మోసి గని పెంచినను
బాసి తత్త్వని తిడితీవి ॥అమ్మ॥ 3

బొమ్మ నిట్టాటలను బొమ్మ రిండ్లను బెట్టి
సొమ్ములనిడి చెప్పితి ।అమ్మ॥ 4

ప్రకృతి సఖులను గూడి
వికృతి జెందితి గాని
సుకృత మెఱుంగ నైతినే ॥అమ్మ॥ 5

పరికృతి సఖులన శబ్ద
స్పర్శాది పంచకమె
సుకృత మేనవి యెఱుఁగూటే ।అమ్మ। 6

ఆదినేను ఇదినీవు
అనిమోస బుచ్చిరి
అదీ యీది నేనైతిగా ।అమ్మ। 7

సహజా మ నస్కాని
సహ చర్యమునఁ జూడ
ఇహాము పరమైతోఁ చెనే ।అమ్మ। 8

సత్య మిదియని తెలిసి
నిత్య ధ్యానము నిలిపి
ప్రత్యగాత్మయి యుంటినే ॥అమ్మ॥ 9

తానె తానను తత్వ
జ్ఞానాము తెలియకను
పూని నోముల నోచితి ।అమ్మ। 10

మహి నాఖైలలి గురుడు
మొహియదీన్ బాష్యాను
మహిమ బ్రోచుట వింటినే ।అమ్మ। 11

సావేరిరాగము - అటతాళము

గురుని దెలియని జన్మ మెందూకు
ఓ వెఱ్ఱి మనసా.

గోప్య మెఱుగని జ్ఞాన మెందూకు
గురుని దెలియని జన్మ మెందుకు
గోప్య మెఱుగని జ్ఞానమెందుకు
హరిని దెలియని యాత్మ యెందుకు
విరసవంబై నిష్ఫలంబౌ ।గురు 1

ఎన్ని జన్మము లెత్తితేనేమి
గురువరుని పదములు
సన్నుతించని నరుని గతియేమి
అన్నవినుతన్మయుడవైతా
మన్న సకలము తానెతానై
కన్నులారా జూడకున్నను
ఎన్ని సాధనములను జేసిన |గురు| 2

తాను తానై నిలచి వెలిగెడవు
తనలోని తత్వము
తరచు గన్నులగాంచి పలికెదవు
పూని సద్గురు పాద సేవను
మోహమున కడు జేయ నేర్చిన
జ్ఞాని మోక్షము బొందగలుగును
వానిదే జన్మంబు నిక్కము |గురు| 3

గురువరేణ్యుని కరుణతోడు తను
వీక్షించి యొసంగిన
గూఢమంత్రమె ముక్తి నిచ్చును
హరిని గనియెడు దారి దొరకును
దురితములె కడు జేయుచుండిన
దొరకునే హరిమరుగు నరునగు |గురు| 4

నేను నేనని వాద మాడెదవు
దేహంబు విడిచిన
నేను ఏమైపోవు ఎరుగావు
గాన శ్రీయాభై లలీగురు
ధ్యానమందున నిలచి జీవ
జ్ఞాన మెఱిఁగిన పద్మనాభు ని
ధాన మిదె వేరెమి యున్నది । గురు । 5



# తత్త్వ సందేశము

## తత్త్వము

వెఱ్ఱులై తిరిగెదరు జనులారా
నిజమింత దెలియక వెఱ్ఱులై తిరిగెదరు జనులారా
మట్టికిరువది యైదుకొమ్మలు
తొట్టు లారయతొమ్మిదున్నవి
పట్టు పట్టున తిరుగుపక్షి
తుట్టు మని పోతెను మిథ్య ॥వె॥ 1

ఏడు కొండలచుట్టి కుండలి
పాడుచున్నది ప్రణవనాదము
తోడనే మనసనెడు చేటిక
యాడుచున్నది జీవనాటిక ॥వె॥ 2

పంచకోశము లనుసరించి
పంచవాయువులను నటించి
పంచవిషయములను కలంచి
సంచరించెడు హంస నెఱుంగక ॥వె॥

సుందరంబగు సరనులోపల
మందిరం బొక టున్నదాదిగో
అందులోపల వెలుంగు దీపము
ముందు నిలచిన చక్రి నరయక ॥వె॥ 4

ఒక్క చూపునఁదిగాంచితేను
ఒక్క మాటను తెలిసితేను
ఒక్క జ్యోతిని నిలిచితేను
నిక్కముగ తను దెలియఁగలరు ॥వె॥ 5

చంద్రుఁ డెవరు చుక్క లెవరు
ఇంద్రుఁ డెవరు ఈశుఁ డెవరు
ఇంద్రియంబులు కట్టిచూచితే
యిన్ని తానై యుండలేద ।వె॥ 6

బంతిచెట్టు పసరుదైనా
బంతిపువ్వు పసిమిఁదౌను
అంతె చూడు నరుఁడుగూడ
వింతగా హరి యగును నిజము ॥వె॥ 7

నీటిచుక్క ముత్యమైతే
తేటియెంగిలి తేనెయైతే
సూటితప్పని గురుని మంత్రము
కోటిసూర్యుల కాంతికాద ॥వె। 8

బురదలోపల పద్మమైతే
ఉఱుములోపల మెఱుపు మెఱిసితె
తరువులోపల నగ్నియుంటె
నరునిలో దేవుండు గలఁడు ।వె। 9

ఆకసంబున నల్లమబ్బ
తోఁకచుక్కను తళుకుబెళుకు
వేకువందున నెఱ్ఱకాంతి
మీకు సంసారంబు లంతె ।వె॥ 10

ఒకటిలో నొక సంఖ్యయున్నది
ఒకటిలేక సంఖ్యలేదు
ఒకటి పుట్టిన చోటు మనకు
ఊహకూడ చొఱకయున్నది ।వె। 11



ఆదియందున నీవె యుంటి ద
నాదియందున నీవె గల వా
వేదభావము తెలిసితే నిః
ఖేదబ్రహ్మము తానెగాదె ।వె॥ 12



దీనిభావము తెలియవలసిన
పూని ఉం రాలీష కవివలె
జ్ఞాని శ్రీయాఖై లలీగురు
స్వామి పాదము బట్టవలయును ॥వె। 13

## జీ వు ని క థ న ము

జీవుని కథనము జెప్పెద వినుము
ఈ విశ్వమును జేఁరగ వచ్చిన త్రోవ ।జీ।

ఆ విరాట్టునుండి అంశము తెగిపోయి
ఆవిర్భవించి మర్త్యాకార మందఁగ
చావు పుట్టుక లనెడుదై ధీ
భావములఁ బడి జడునికై వడి
కేవలాజ్ఞానాంధకారమె
తావలంబగు తనువు తానను ।జీ। 1

ఈ పంచభూతాల నిమిడిన విషయాల
ప్రాపుజేరి ప్రపంచములోపల
ఆపద లనుభవింపగను జన్మించి స
ద్రూపము చెడి యేదో రూపము గై కొని
కాపురము జేయుచును సతి సుత
రూప తాపత్రయములను బడి
ఆ పరబ్రహ్మస్వరూప మ
హా పదార్థము మఱచి తిరిగెను ॥జీ॥ 2

శారీరకపు సౌరు కారణమగు తీరు
కోరి పుత్ర దారేషణావస్థల
మీరఁగలేక సంసార ఘోర పారా
వార మీదు దారి నేరక గాఢాంధ
కార మగు ప్రారబ్ధకర్మా
గారమున జడుఁ డగుచు తొంబది
యారు చక్రము లున్న తనువును
ఈ రథంబును నడుపుచున్న ।జీ।

రేలని పగలని కాలచక్రములోని
కీలు తెలియలేే కార్తిపాలై కల
కాలము విషయసౌఖ్యాళి నోలలాడి
యీ లోకమే నిజమం
నాలోచించి యెపుడో
కూలి యీ తిరుగలిసి బోలెడు
కాలనిహాతిని బూడిదై తుద
ధూళిధూసరములను గలసి వి
శాల విశ్వము విడిచిపోయే ।జీ॥ 4

మాయయు ఆ ప్రతి ఛాయము గల యుపా
దేయమైన యీ కాయమే యీ యవి
ద్యాయుత మగు దేహావరణ విక్షేప
మై యొప్పు; కూటస్థమై యున్న పరమాత్మ
కి యుపాధియు నింద్రియంబులు
నీ రజస్సత్వాది గుణములు
నే యవస్థల నంట కిది జల
తోయజంబుల తీరు దనరు ।జీ।

అణురూపముగ మారి జనని గర్భముజేరి
జననమొంది బాలేందు బింబాకృతి
దినదినము పెటిగి జీవన నాట్యరంగమున
జని కాలుమోపి నర్తనము జేయుచు స్వీయ

ఘన మహాచరితంబు బాడుచు
వినుచు నీమూన్నాళ్ల బ్రతుకును
గనుచు విది తనదనుచు తుది కల
గను విధంబున విడిచి నడిచే ||జీ|| 6

ఈ కర్మవాంఛల చీకాకుపడి చాల
శోక మోహ భయైకమౌ నూహల
ఆకాశమునకు భూలోకంబునకు తాళ్ళ
తోకట్టి యూఁగ ప్రాకి ప్రాకి యెప్పుడో
ఈ కళేబర మిచట విడచియు
నాకమున కేకాకియై యా
భీకరములగు పథములను బడి
పోక మునుపే తెలిసికొనుటకు ||జీ| 7

ఆఱాఱు తత్వాల మీఱిన యోంకారా
కారమైన యాకారమె జీవుడు
ఆరూఢి సుషుమ్నాదారి నివ్వరిముల్లు
తీరు మెఱయుచు హరిని జేరు ధారణయందు
ఆ రహస్యము తెలిసి ఉమ
రాలిషాకవి వలెను సాధకు
డాఱితేఱి వివాద మణచియు
నూరకొను నానందమందుచు |జీ 8

సురటరాగము - ఆదితాళము

కోరివిసుము తత్వచరితము జేసి
నిజధర్మమిది మదిని మీరి
పారమార్థిక చ్యుతుడుశరీరి
మాయతో బ్రపంచము జేరి
సారహీన సంసృతిలోన జారి
ప్రకృతిలో బడివై రి
వారములకుఁ జిక్కి నరుఁడై
దారపుత్రులో యనుచు మూర్ఖుఁడై వారి
హితమరయుచు పరము కరిగెను
దారేమి నారయక యవిద్యను ।కోరి॥ 1

మట్టి వంటి తనువు
స్థిరమని
పట్టి ప్రేమ విడవు-దీని
గుట్టు తెలియలేవు- దేహము
వట్టిరోగము లనెలవు-ఇది
పుట్టిమెఱపు రీరి దోచిపోవును
ఇట్టిమాయమగుచు నొక్కత్రుటియే
పట్టదు నిక్కము నిజరూప మెఱుగులే
వట్టినరుఁ డిధోగతిని బడి వి

రాట్టయిన యాత్మను సవివగతి
గిట్ట భవసముద్రమున నిడి
మట్టయిచని తిరిగి మర్త్యుడై
పుట్టును యథాస్థితి నింద్రియముల
తట్టు జేరతున్న తానెంవండను యోగదీక్ష
నెట్టు యార్ధిక విషయవిరతి
మెట్గి స్వప్రకాశ భ్రష్టుడౌ తుద
ముట్టన్ జనడు జీవుడ హరియయి ||కోరి|| 2

కాల వశముచేత కర్మ
కలాప భీతచేతసుడవై
తేలలేక పాతకాంబుధి
గూలి పోయితివి ప్రేతవై
తేలి తొంటి జన్మములను గని
బేలవై విచారపడి కడచి యీ
వేల నిజసదనము జని గురునిగని
వెఱగి చూపుదెలిసి గుణ మి
శ్యాలాలసత్వ మణచి శమదమ
శీలాన్వితుడ వగుదు వలదే
సాలాగ్రంబున పేణునాద
మాలాపనంబు సేయు చక్రియ
నాలోచిత మనస్కు లీరహస్యము
ఆలోకనసేయ రిదెతపసు

మాలికలను ద్రిప్పుకొనిన మనసు
మాలిన్య మరుగ దెప్పుడి దె తెలుపు ॥కో॥
మంద బుద్ధి గాక
ఇంద్రియ
కంధములను జొఱక
మోహ
స్పందితుండు నగుచు చెందక
డిందివిషయ విహ్వలుఁడు గాక
అందరాని యమస్కపదము నొంద
లంది తృప్తి బొంది తాను తానై
యుండునందు నొక్కరీతి వెలిఁగి బ్రహ్మ
నంద పందవి గని చిత్ప్రకాశుఁడవి
చిందాత్మకుఁడు పూర్ణుఁడగుణుఁడు
వందితుండు నిగమునుతుడు స
నందానేక బుషుల పోలిక
నంది జడత బాసియుండు న
మంద దివ్యసుఖము జెందు జన్మల
నందఁబోఁడు యథేచ్ఛగాఁ దిరుగు
సందియంబు లేదు ముక్తి విధమిల
కుందకను కృతార్థుఁడై చనుము ॥కో॥

ఆదియందు నీవె
ఆ య

నాది యందు నీవె

యిటుపై

యాదిమధ్య లయుఁడు నీవె

నాదమై యనంత మహిమా

పాదుడై తనువు గరిగిన పోయిన

భాధితుండు గాక శిధిల ఘోరపౖ

మాదమౌ యవస్థలుడిగి జ్ఞానో

పాధికుఁడ వగుచు స్వప్రకాశమతి

మోదావహము నైన తన్మయ

సాధకమున నగుపడెడు పద

చ్ఛేదం బైన ప్రతిపదార్ధ మ

భేదబుద్ధి తాను గాగ వి

వాదమణఁచి యంతరాత్మ ॥సోహం॥

పాదద్వయము జపము సేయ కృత

సాధకుండు జ్ఞానమూర్తి యెచ్చట

పాదముంచు వచ్చట స్వారాజ్యమగు ॥కో॥

ంచభూత మయుఁడు

ఈశ్వరుఁ

డంచు తెలియు నరుఁడు

తానదె

యంచు చెప్పగలఁడు

తానుతాఁ

గాంచి యేమఱియు నతఁడు తీ
క్షించు నీమహా యజాండబాండము
ఘంచుబిందొవో యన పరి
కించు, సమంచితమగు చరాచరము లెద న
ర్థించి, మేఘములలోన మెఱసి వ
ర్షించి, ననీసలలమై పర
తెంచి, కుసుమ సౌరభముల
పొంచి, ఉండు కోటి లోపల న
లంచి, రవియై రవికంపెను
మించి, యొక్క అణువై భువి కవత
రించి, కోకిలంబునయి వనముల ధ్వ
నించ, పాటపాడి తానె సకల మ
టంచు, నెంచు విశ్వరూపముగా ।కో।

ఈ రహస్య మిందు
దెలిపిన
నారు యోగు లందు
ముఖ్యులు
ధీరు లిందు నందు
తెలుపఁగ
గోరుచుందు రందందు
ఈ

దారి నెనసి నితరులు తరింపఁగను సొం
వారఁ దలఁచి దివ్యేదివ్యేను పుట్టి
దారుణమైన తమ సుప్రకాశమైన
తీరున పవిత్రుఁడు హరి ప్రణవా
కారుఁడైన ఆఖై లలీగురుం
డీ శాదాంత మంత ఉమర్
లీషాకవి కొసకగె భక్తై
కారంభ విదూరులకును సం
సారాగ్ని నిమగ్నులకుఁ దెలియ
నేర దిది. యమేయ దివ్య
స్ఫారం బై సువి
చార మతీంద్రియా రుసం
స్కార చారువేదాంత తత్వార్థవి
ద్యారాజ పదము బొందు మట ॥కో॥

రారేమి అక్కలారా
ద్వారాలు తీయరేలా
కూర్చుండాకలి కల్కికి
ప్రారంభమయ్యె
పోరు మిన్నులు ముట్టఁగ ॥రా॥

నిప్పులు గురిసె నభము
అప్పుల ముంచె జగము
విప్పి విప్పని బందాలు
తప్పించుకొనుచు
చప్పు చప్పున పరువెత్తి ।రా। 2

ఏళ్ళన్ని పొంగెనందు
ఊళ్ళన్ని మునిఁగే ముందు
బళ్ళబాజులు కల్గి నా
కళ్లా వెళ్లఁడు బైటకు ।రా। 3

చీఁకట్లు దిశలు నిఁడె
వాకళ్ల మంచు పఁడె
వేకువ యింక రాదేమో
ఆకాశవీధి
తోకచుక్కలు కన్నారా ॥రా॥

నాగళ్లు దున్నినట్టి
రాగాల మబ్బు మళ్ల
దాఁగె చంద్రుడు మింటను
ఆ గంటలోనె
తూఁగి చుక్కలు రాలెను ॥రా॥

చదలేటి యంచపిండు
కదలేటి మబ్బుకొండ
కెదురు తెక్కలు ఉవ్వఁగ
రుధిరంబు గురిసె
నదులై లోకము ముంచఁగ ॥రా॥ 6

పాతేటి యేటియడుగు
జాతేటి నెలల వెలుఁగు
తేటి చూచిన చెంగలువ
గోరింటలోను
దూటి నింపెను నెత్తురులు ॥రా॥ 7

పాతాళవీధి కేగి
లోతైన జలధి దాఁగి
భీతిఁగలిగెడు లోకాల
కేతెంచి వచ్చె
దూత కర్యములియ్యరె ॥రా॥ 8

కలి కల్కి యుద్ధమంటె
తలకట్టు విప్పి కట్టె
కలికి కెంతటి రోషమొ
అల యాదిశక్తి
చలము గెలిచెను చూడఁగా ॥రా॥ 9

# — ధ్యానము —

అజ్ఞానపు తెరలోనః హరి తోచెను చూడు
జిజ్ఞాసను మబ్బున నెలః చెన్నారెను నేడు 1

కన్నీళ్ళను దావాగ్ని। కణజాలము గలదు
ఛిన్నుల యెదరుధిరములో। కెరటంబులు గలవు 2

రాధానయ నాబ్దములకు రవియుదయించినను
మాధవు దే యగపడు విను। వీథులువెలు గ గను 3

శుక్తికలో ముత్యమ్ములు। శోభిల్లుచు నుండె
భక్తిని ఉమరలిషాకపి। భగవంతు డె నిండె 4

నిను గనుగొన నా మనము తపించె నన్
గనుగొన వపార కరుణా భరణా ॥నిను॥ 5

అన్నియు నీవని అర్పణ జేసితి
నన్నొడ బాయుట న్యాయమాస్వామి ।నిను। 6

నీలో నే నొక నెరసును కానో
ఆలోచింపుము ఐక్యముజెంద ॥నిను॥ 3
నావా రెవ్వరు నీవేకావా
ఆవలగల నా తావే నీనని ।నిను। 4

హృదయము వీణాకృతి కృతిపాడుచు
అదె నినుబిలుచు నుంరాలీషావలె ।విను॥ 5

## పూజ

విరులు కరముల తెండో
తరియింప మీహృదయ
సరిసి లోపల త్రెంపి ॥విరు। 1

తెఱచియున్నదిస్వామి। పరమార్థమందిరము
పరఁగు జ్ఞానపుదీప। పంక్తి తమమునుఁబాప
కరుణారసము వెల్లి
విరియుచున్నదిభక్తి ।విరు। 2

తడవేల చీఁకటుల। పడరానికష్టాలఁ
బడిమాయ యమకడలి। కడతేరకున్నారు
చెడనట్టి యీకాంతి
పడవెక్కి దాఁటెదరు ।విరు। 3

చనసేల పాపాల, మనరానిదుఃఖాల
గని కృంగి కృంగి మే। దిని బుట్టివ్యసనాల
మునిఁగిపోవుట చాల
తునిఁగిపోవుట మేల ।విరు। 5

స్వాగతంబిడి చేయి। చాచి రమ్మనుచుండె
ఆ గురుస్థానమున। కాకాంతి ధామమున
తేగి ఉంరాలీషాతో
భాగధేయముగాంచి ।విరు। 3

## — హారతి —

హారతి జయజయ హారతి
శ్రీ గురుదేవ ॥హా॥
గై కొనుము స్వామి
నీరాజనములు నీ। పేరు పేరునఁగూర్చి
ఆరాధించుచు భక్తి। నర్పించు కర్పూర ।హా। 1

పరమభక్తులు జ్ఞాన। భరిత సాధ్వీమణులు
కరములు మోడ్చియా। విరి పళ్లెరమునసిచ్చు ।హా।

పరతత్వ తేజమున వరములు మాకిచ్చి
యరయు ముమరలిషాను। నరసి నట్టుల నిదిగో ।హా॥



# తప్పు ఒప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 1 | పాదకబైన | పాదకంబైన |
| 7 | 13 | నాలతో | నీలతో |
| 10 | 12 | ష | ఘ |
| 13 | 10 | ్రమయ | మయ |
| 14 | 9 | నరజన్మ | నరజన్మం |
| 22 | 3 | కే | పై |
| 24 | 1 | దిగాంచి | గాంచి |
| 25 | 9 | ద | వ |
| 27 | 16 | కడి | కిది |
| 29 | 9 | హీత | హిత |
| ,, | 16 | రీరి | రీతి |
| ,, | 18 | మెఱుగులే | మెఱగలే |
| 30 | 5 | జేరుతున్న | జేరు. తన్ను |
| ,, | 15 | లేల | లీల |
| ,, | 18 | వలదే | వందే |
| ,, | 19 | సాలా | ఫాలా |
| 31 | 11 | యిండు | యిందు |
| ,, | 12 | పందవి | పదవి |
| ,, | 13 | చిందా | నిందా |

| | | | |
|---|---|---|---|
| 31 | 15 | బుషుల | ఋషుల |
| 32 | 3 | లయుఃడు | లయుడు |
| ,, | 5 | గరిగిన | గలిగిన |
| 33 | 6 | నసీసలలమై | నదీసలిలమై |
| ,, | 9 | లుంచి | టించి |
| ,, | 12 | చేంచ | నించ |
| ,, | 15 | దెలిపిన | దెలిసిన |
| ,, | 16 | నారు | వాదు |
| 34 | 7 | కొనకగె | కొసంగె |
| ,, | 11 | భైసువి | భైనసువి |
| ,, | 12 | యూ | యో |
| 35 | 8 | బాజలు | బాటలు |
| ,, | 9 | కళ్లావెళ్లుఁడు | కళ్లారజూచి |
| ,, | 9 | బైటకురా | వెళ్లువెళ్లుడుబైటకు |
| 36 | 20 | పంక్తి తరువాత<br>క్రిందవిచేర్చుము | ఈ కల్పమంతమొందు<br>ఆకల్కి రాజ్యమందు<br>శ్రీకయి ఉంరలిషాకవి<br>కాభైలలిషుఁ<br>డీ. కథార్థముచెప్పును ॥రా॥ |
| 38 | ,, | యమఃకడలి | యమునకడలి |

ఈ పుస్తకములో అచ్చు తప్పులు పడినవి.

మా యందు దయవుంచి

తప్పు ఒప్పుల పట్టిక చూచుకొనవలయును.

నమస్తే నమస్తే నమః ఓం శ్శాంతి శ్శాంతిః



ఈ పుస్తకము అచ్చువేయించుటకు

శ్రీమతి దెందులూరి మహంకాళమ్మగారు

బొండాడపేట గ్రామం

ఆకివీడు తాలూకా,

పశ్చిమ గోదావరి జిల్లా.

ఆర్థిక సహకారము అందించిరి.

వారిని స్వామి సర్వదా కాపాడుగాక.